# సంకుసాల నృసింహకవి

విద్వాన్ పి. వి. రామిరెడ్డి

సోల్ డిస్ట్రిబ్యూటర్స్

షిర్డి పబ్లిషింగ్ హౌస్

స్వామి అయ్యప్ప వీధి :: పటమట

విజయవాడ-7

ప్రచురణ :
ఆగస్టు 1984

ఈ పుస్తకమును ఆంధ్రప్రదేశ్ పాఠశాలల విద్యాకమీషనర్ ఉత్తర్వుల ప్రకారము రాష్ట్రములోని సమస్త పాఠశాలల గ్రంథాలయముల కొరకు కొనుటకు అనుమతించబడినది.

Rc No. 499/S4/83
Dated 19-3-1984

వెల : రు. 3-50

ముద్రణ :
శ్రీ వెంకటరమణ
ఖాక్స్ ప్రింటింగు వర్క్సు,
విజయవాడ-520 002.

# పరిచయవాక్యము

కడపమండల మనాదినుండి కవులకు, మహాకవులకు, కవిరాజులకు, రాజకవులకు, బాలకవులకు, ప్రౌఢకవులకు విద్వత్కవులకు పేరుకెక్కినది. పురాణేతిహాసములకుఁ బుట్టినిల్లయి-ప్రబంధ రాజములకుఁ బవిత్ర జన్మభూమియై నెగడినది హిరణ్యమండలము. ఆంధ్ర సారస్వత సేవను సర్వతోముఖముగ సాగించి యాంధ్ర భాషామతల్లికి రూపురేఖలఁ దిద్ది తీర్చినది మండలము. అష్టదిగ్గజ కవులలోఁ బేరుమోసిన రామరాజ భూషణుఁడు, నృసింహకవి కడపమండలమున జన్మించినవారలే. ఈ మండలమున బుట్టి కవిత్వ పటుత్వ సంపదల లోకమునకుఁ జాటి కాలగర్భమున గలిసిపోయిన కవుల చరిత్రను త్రవ్వి తీయుటే యిందలి ముఖ్యోద్దేశము.

గురు బాల ప్రయోజనార్థము విమర్శనా దృష్టితో రచించితిని. విద్యార్థులలో విమర్శనాజ్ఞానము - పరిశీలనాత్మక దృష్టి, శాసన పరిశోధనము, కావ్యపఠనము మొదలగువాటిపై నభిరుచి గలుగఁజేయుటకీ గ్రంథము దోడ్పడునని యాశించుచున్నాడ.

సింహాద్రిపురం
5-1-62

ఇట్లు
కవిజన సంసేవితుఁడు
పి. వి. రెడ్డి,
"వివేకప్రబోధము" పత్రిక మాజీ సంపాదకుఁడు.

# సంకుసాల నృసింహకవి

## 1

విజయనగరకోట కొమ్మలమీద నాంధ్రపతాక మాకాశ వీథుల్లో రెపరెపలాడుచు నాంధ్రుల యౌన్నత్యమును జాటు కొంటున్న రోజులవి. ఆంధ్రసాహిత్య రంగములో నూతనా ధ్యాయమును సృష్టింప యత్నించు దినములవి. పురాణయుగ మునకు భరతవాక్యము, ప్రబంధ యుగమునకు నాంది బాడు కొంటున్న నాడులవి. ఆంధ్ర భాషామతల్లి కష్టదిగ్గజ కవు లర్పించు ప్రబంధ కుసుమాంజలుల సువాసనలు గుబాళించి హరిదంతముల నాక్రమించు కాలమది. సాహితీ సమరాంగణ సార్వభౌముడౌ శ్రీకృష్ణదేవరాయలు సర్వతోముఖముగ సమస్త కళల బోషింప గంకణముగట్టి కవుల కాశ్రయ మొస గుచు-గవితా కన్యక గొంగ్రొత్త వలపులఁ గ్రేగంటి జూపుల నాదరించుచు, విజయనగరసామ్రాజ్యమును విస్తృత మొనర్చుచు నాంధ్ర మాత సమందానందాబ్ధి నోలలాడించుచున్న గడియ లవి. రాజకవియై రాయలు కవిరాజుల దనయాస్థానమున నష్ట దిగ్గజములవలె నెలకొల్ప నుబలాటపడు సమయమది.

దూరదూరాలనుండి కవులష్టకష్టముల సైరించి తమ కావ్యకన్యకల రాయలకర్పించి విఖ్యామంద విద్యానగరము నకు విచ్చేయుచుండిరి. సందు గొందుల సైతము కవుల దర్శన మబ్బుచుండెను.

ఉదయ మెనిమిది గంటల కాలమది. విశాల ఫాల భాగమున దిరుచూర్ణము కరకమలముల దాళపత్ర గ్రంథము మెరయుచుండ పరమ వైష్ణవత్వము బుంభావ సరస్వతీత్వమున మూర్తీభవించినట్లుఁ జూపరులకుఁ గోచరించుచుండ విఫణవీధి గునగున గునకపరువులేయు వ్యక్తి యెవడై యుండును?

ఆ నిరుపహతిస్థల ప్రాంగణమున నడుగిడుచున్నాడు. ఆంధ్ర ప్రబంధ బిరుదాంచితుఁడైన నల్లసాని పెద్దన్న ఆముక్త మాల్యదను బరిశీలనాదృష్టితో బరికించుచున్న సమయమది. పదముల చప్పుడింత చెవిసోకినంతనే కన్ను గదల్చినాడు. లోన బ్రవేశించిన వ్యక్తి యేటికోళ్ళ శతములర్పించినాడు. పెద్దన్న గారి కనుసైగలే యాసీనులు గండని ప్రత్యుత్తరము లిచ్చినవి. ఉచితాసీనుఁడై తన యుదంతము నెరిగింప నుద్యుక్తుడగు చున్నాడు వచ్చినవ్యక్తి. ఇంతలో నీ క్రింది సంభాషణము జరిగినది.

పెద్దన్న :- తమ యెడబాటునకే పవిత్రస్థల మామోదించినది? తమరాక కేమి కారణము?

వ్యక్తి :- నాయభినివేశము సుకేశుల. భాజ సందర్శనార్థమై వచ్చితిని.

పెద్దన్న :- తమ పవిత్ర నామాక్షరము లేవి?

వ్యక్తి :- నృసింహాకవి.

పెద్దన్న :- ఏమిటీ! కవిసింహామా?

నృ-కవి:- ఆఁ. నృసింహాకవి.

పెద్దన్న :- అబ్బా! అందరు కవులే! విద్యానగర విపణి వీథుల్లో సందు గొందుల్లో గవులే క్రిక్కిరిసియున్నారు. కలము బట్టినవాడెల్లా కవియగునా? యతిప్రాసములతో గూడిన పద్యములే కావ్యములగునా? కాళ్ళు సేతులుంటే కన్యక యగునా? ఈ కాలములో గవిగానివాఁడెవడు? ఇచ్చు వాడున్న చచ్చువాఁడు సైతము లేచివచ్చు నన్న లోకోక్తి సార్థకమగుచున్నది. ఎందరికని రాజదర్శన మిప్పింతును?

నృ-కవి:- ఆంధ్ర సాహిత్యరంగమున నాంధ్రభోజ బిరుదాంకితుఁడైన కృష్ణదేవరాయల దర్శనమే దుర్లభమందురా?

పెద్దన్న :- ఔను. కడుదుర్లభము. తాము గ్రంథమును రచించితిరా ?

నృ-కవి:- నలువదియైదు వర్ణనలతో గూడిన ప్రబంధరాజము.

పెద్దన్న :- ప్రబంధమా? పేరు?

నృ-కవి:- కవికర్ణ రసాయనము.

పెద్దన్న :- పేలుపెద్ద-ఊరుదిబ్బ. పేరుకేమిగాని-ప్రకృతము

రాజ సందర్శనమునకు వీలులేదు. తరువాత నాలో చింతును.

పెదవివిరిచి విఫలప్రయత్న మనోరథుఁడై నృసింహకవి విపణి మార్గమునబడి తన విడిదిని జేరుకొనెను.

## 2

పోతుటీగమైనను జొరని యంతఃపుర మందిరమది. హంసతూలికా తల్పభాగమున భువన మోహనాకారతమించు మించుబోడి మించుముంచుకొనివచ్చు నాలోచనాంబునిధిలో మునకలు వేయు మోహనాంగినిఁ దిలకింపుము. అప్రాణ విప్రాణ ప్రీణిత సకలార్థి సంతానుండును, నవప్రవిక్రమ పరాక్రముం డును, సమస్తాశాంత మాతంగ మర్యాదాలంకృతమైన భూవలయ మాత్మాయత్తమై యేలరారు వాడును, దిగంతవ్యాపిత యశో విభవుండును నగు శ్రీకృష్ణదేవరాయల యాత్మతనూజాతయై యొప్పు నొప్పులకుప్ప యామె. కవితా ధోరణిలో గవితల్లజుల ముప్పుదిప్పలువెట్ట యోచించినదామె. స్ఫురించిన భావమును లిఖింప యత్నించి ఘంటమును గదల్ప మొదలిడినది. అదిగో! లిఖించిన పద్యపాదమును జదువుము.

"ఉద్ధతుల మధ్యఁ బేదల-కుండఁదరమె"

పూర్వార్థమును బూరింప యత్నించినది. శిరఃకంప మొనర్చినది. అర్థాంతరన్యాసాలంకార సమన్వయము సెడని

క్రమ మాలోచించినది. పరిచారికను జేరఁజేరి తాళపత్రము నొసఁగి పూరణార్థ మల్లసానివారింటి కంపినది. పని తొందర అలోఁ బరిచారిక వేరొండు మార్గమున బడిపోయి నృసింహాకవి విడిదినిఁ జేరినది.

అల్లసానివారి యాదరాభిమానముల గోల్పోయిన కత మున గాబోలు తన ప్రబంధరాజమున సవరణల కుద్దేశించి కలము ముట్టినకాలమది. అల్లసానివారు ఆందోళికపై నూరేగిన సందర్భమును బురస్కరించుకొని పరోక్షమున నాతని దూయఁ బట్టి రచించిన పద్యమును బలుమారీ క్రింది విధముగ జదువు చున్నాడు.

సీ. ఆందోళికలయందు నంతర చరులైన సవికృతాకృతుల పిశాచజనులు
వరకరాళంబులై ప్రార్థింపఁ గనుగోక వాయెత్తకుండు జీవచ్ఛవములు
వాలవీజనముల గ్రాలుచు నీగకునంటీవి ఖరవర్తులాండసములు
వేత్రపరంపరా విలకంటకాకృతిఁ జేరఁబోరాని బర్బూరతరులు.

తే. శంఖ నాగస్వర స్వరశ్రమణసమద విస్ఫుటచ్ఛత్ర విస్ఫారితస్ఫటాక,
దిష్టవిషవైద్య వశవర్తి దుష్టఫణుల ప్రభుదురాత్ములనెవ్వాడు బ్రస్తుతించు.

నరపతులను నిర్మొహమాటముగ దూయఁబట్టి నరాంకిత మీయనొల్లక యేవగించుకొన్నాడు. ముందు రచించిన పీఠికనే తారుమారు జేయఁ దీవ్రముగ నాలోచించుచున్నాడు. ఇంతలో హడావుడితో లోనఁ బ్రవేశించిన పరిచారిక తాళపత్రము నాతని కందించినది. అర్థాని నవలోకించి నృసింహాకవి సమయస్ఫూర్తి

నుపయోగించి యల్లసాని వానిపైఁగల యసూయా భావ ముతో, లభించిన సదవకాశమును జారవిడువ నొల్లక మోహ నాంగికిఁ దగిన సమధానమంప నిశ్చయించెను.

ఈ క్రింది విధముగఁ బద్యమును బూరించెను.

తే. ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిఁజూచి,
తరుణి తను మధ్యమెచటికో దలఁగిపోయె.
నుండెనేనియుఁ గనబడకున్నె; యహహ
యుద్ధతుల మధ్య, బేదల కుండఁదరమె॥

ఔరా! యెంత గుండెదిటవు. సమాధానమిచ్చునది రాజ కన్యకయని తెలిసియు శృంగార వర్ణనాచాతుర్యముతో నిందా గర్భితముగ బ్రతిపక్షులపై దెబ్బదీయనెంచి పై పద్యమును రచించి సాహసోపేతుఁడై పరిచారిక కందించెను. ప్రాంతీయాభి మానములు విశృంఖలవృత్తి స్వైరవిహార మొనర్చి యోగ్యతను స్వీకారమునకుఁ బ్రాపిక దూరదూరాలకు నాస్థానకవులు కవిరాజుల నెట్టుట గిట్టకపోయిన దీతనికి. పెచ్చుబెరిగిన మాత్స ర్యమునకు విలయతాండవమాడు మదోన్మత్తికి నిలయులై కవులు రాజులఁ దమ చెప్పుచేతల్లో కీలుబొమ్మలుగ బెట్టుకొని యధికార దుర్వినియోగ మొనర్చుచు తోడికవుల గోడుబోసు కొనుట సైరింపలేకపోయినాడు. పద్యభావమును బరిశీలించెడు వారందలి యదార్థమును గుర్తింతురని యాశించినాడు. ఆ పిమ్మటనైనా తనకు మేలు గలుఁగవచ్చునని తృప్తిబడినాడు.

మోహనాంగి తదేకధ్యానముతోఁ బద్యమును బరిశీలించి నది. భావమును గమనించినది. ఆందోళనాపూరితమగు ఈ పద్య రచన యల్లసాని పెద్దన్న కవిది కాదని గ్రహించినది. హృద యావేదనమును వెలిబుచ్చిన వారెవరో యజ్ఞాత కవియై యుండవచ్చునని తలంచినది. తన తండ్రి పాలనమువనే కవితల్లి జునకో తీరని యన్యాయము జరిగినదనియు నాస్థానకవులే తన తండ్రి యాంధ్రభోజ బిరుదత్వమునకే న్యూనత గల్పింపఁ దలపెట్టిరనియు నామెకుఁ దోచినది. అల్లసానివారి నిరంకుశ ప్రవర్తనవల్ల నిరాశా ప్రపీడితులై యెందరు కవివరేణ్యులు దినవెచ్చమునకు లేక విద్యానగర వీధుల్లో బిడియమును వదలి సంచరించుచుండిరో యని హృదయావేదన మొందినది. తన తండ్రి కాపాడింపనున్న దుర్యశమును దొలగింప పద్యమల్లిన కవితల్లజు నుల్లము బల్లవింప బహుమాన రూపమున నాలుగు వేల వరహాలను బంపినది. చిల్లిగవ్వైనను చేతలేక చింతా క్రాంతుడై యున్న నృసింహాకవికి నాలుగువేల వరహాలొకింత హృదయ తాపమునపనయించినవి.

## 3

ప్రతిభాన్వితుల మహత్తు మరుగువడునా? బహుమానము సంగతి పలువురినోటఁ బడినది. నృసింహాకవి యింటికి రాక పోకలు పెచ్చు పెరిగినవి.

విద్యానగరమున వసతిగృహములే కరవైనవి. రాజ సందర్శనార్థమై వేంచేయు కవులకు, గాయకులకు, శిల్పులకు విరుగడ తరుగడయే లేకుండెను. ఒకానొక వ్యక్తి వాలకమును బట్టి చూడ కవిని దలపించువాడు. బహుళా వసతి గృహాన్వేష ణార్థియై పురవీధులఁ బడిపోవుచుండెను. తనదృష్టి నాకర్షించిన యొక మందిర ప్రాంగణమున నాతడు నిలబడినాడు. గృహ ద్వారమునకుఁ గట్టఁబడిన పలకను దిలకించి లోన ప్రవేశించెను.

శరవేగమున ఘంటమును గదల్చుచు నేదో లిఖించు చున్న నృసింహకవిని సమీపించినాడా వ్యక్తి.

నృ-కవి :- మహాశయా! ఎంత దూరమునుండి పయనమును సాగించితిరి? తమపేరేది? రాజదర్శన మభిలషించి వచ్చి నట్లు దోచెడిది?

వ్యక్తి :- చాల వ్యయ ప్రయాసములకోర్చి వచ్చితిని. నాపేరు ధూర్జటి. రాజదర్శనము లభించుట కరము దుర్ఘర ముగ నున్నదని వినికిడి.

నృ-కవి :- కాళహస్తి మహాత్మ్యము పూర్తియైనదా?

ధూ-కవి :- ఔను. ప్రకృతము హంసపాదులతో దాము సవరించు కావ్యమేది.

నృ-కవి :- కవికర్ణ రసాయనము.

ధూ-కవి :- పూర్వ కవిస్తుతిని దొలగించినట్లున్నదే?

నృ-కవి :- అవును. దానికి బదులుగ సత్కవి ప్రశంస మొనర్చితిని వినుము.

మ. మనమునగొన్న నెవ్వగలుమాన్పి ఘటింతురు కావ్యసమ్మదం
బనఘ! కథాముఖంబున హితాహితబోధ మొనర్తురింపుగా
గనుగొనుటకంటె వద్భుతముగా నెఱిగింతురతీంద్రియార్థముల్
ఘనమతులెల్ల వారికి నకారణ బంధువులుగారె సత్కవుల్

ధూ-కవి :- సత్కావ్య రచనా నైపుణీ ధురీణుల కంతరాయ ములఁ నసూయాభావమున గల్పించుచు రాజదర్శనమున కెడమీక నధికార దుర్వినియోగ మొనర్చువారు సత్కవి శ్రేణి కెట్లు జెందుదురు. ఇట్టి కాకవుల బొగడుటకంటె సత్కవి ప్రశంసయే నయము.

నృ-కవి :- సాంగోపాంగముగ సత్కావ్య సంచయములఁ బరికింపక స్వార్థపరులై తమ కావ్యములఁ దలఁదన్ను కావ్యముల రచ్చకెక్కనీక తమపేరు ప్రతిష్టలకుఁ బ్రాకులాడు పెద్దన్నలు సత్కవిశ్రేణి కెన్నడును జెందజాలరు.

ధూ-కవి:- కవిశేఖరా! పొరబడితిని. ఆంధ్రభోజ బిరుదాంచితుడై యాంధ్రభాషాపోషకు నిరవధికముగ సేవ సేయ బద్ధకంకణముూనిన శ్రీకృష్ణదేవరాయ లాస్థానమున నిట్టి యసూయాపరులుందురని కలనైనను దలంపక, కావ్య ప్రచారమున కొకింత దోహదము లభించు నని కొండంతాశతో వచ్చితిని. మీ భావమున నాత్మ స్తుతి పరాయణత్వముగాని, స్వాతిశయ స్వభావముగాని

లేదని నిర్మోగమాటముగ ఘంటాపదముగ నుడువు చున్నాడ౦.

నృ-కవి:- ధూర్జటికవి! రసజ్ఞ భూషణమును గురించి నీ యభి ప్రాయమేమిటి?

ధూ-కవి:- ఏది! శ్రుతిచేయ మొనర్పుము.

నృ-కవి:- ఆ॥ తప్పుగల్గెనేని తారతీర్చిరసజ్ఞుల స్మదీయకవిత ననుమతింత్రు యించుకలుక గలిగెనేఁదీర్చి ప్రేయసి: నుల్లము నవరింపకోర్తు రెట్లు

ధూ-కవి:- ఎంతటి వినయసంపత్తి! ఏమంటిరి. అలుఁకదీర్చి ప్రేయసిని ప్రియవల్లభుఁడు దేర్చినట్లు ననూయాగ్రస్తులైనను రసజ్ఞులు రసజ్ఞులను ప్రేమించుట సర్వశ్రేయోదాయక మనుట సమంజసమే.

నృ-కవి:- నా ప్రతిజ్ఞావచనముల నాలకింపుము.

ధూ-కవి:- అల్లసానివారి నధిక్షేపించుచే నీ ప్రతిజ్ఞాఫలితమా?

నృ-కవి:- ఔను.

"మ. హృదయగతిం బురాతన కవీశ్వరులేగని వీధిలేదు: నే
దదనుమతిం రచించుకృతి తాత్త్వికులం గరగింపకుండునే
మదగజరాజముల్ చనిన మార్గములం గడునింపునింపవే
మదగజరాజయాన మదమంథర బంధురయానముల్"

ధూ-కవి:- ఔరా! ఎంత సాహసము, "మదగజ రాజముల్ చనిన మార్గములన్" అనుటనుబట్టి యల్లసాని పెద్దనాది కవి మదగజేంద్రములు నవ్యకావ్య రచనా సంవిధానము నందనుసరించిన మార్గము లోక్కభూపాలుర

మెప్పునేగాంచుననియు-తమ కవితాకన్య మదగజ రాజ గమనయై హావభావ విలాసాదులతో బురవీధుల నూరేగ రెుట్టివారి కానంద మొడగూర్పదు. పెద్దనాదు లేగిన మార్గములు మద గజరాజములేగు విపణివీధులే యయిన మీరు ద్రొక్కినబాట మదగజ రాజయానలేగు రాజ బాటయె యగును. శృంగార వర్ణనా భూయిష్టమైన కావ్యకన్యకను ప్రేమింపని వారుందురా? భూవిభుని భువనవిజయమునసేగాక భువనశ్రేణియందు నైతము మన్ననలందఁదగిన మీ కావ్యకల్పనా కౌశల్యమునెంతని ప్రస్తుతింతును.

నృ-కవి.- ధూర్జటికవీ! కాలాతీతమైనది. లెమ్ము. భోజనానంతరము చర్చించుకొందము.

# 4

పరమపావన నదీమతల్లియై తనర్చు తుంగభద్రానదీ జలముల నఘమర్షణస్నాన మాచరించి తీరమును జేరుసరికి గుడి గంటలు గణగణమ్రోగినవి. ఆదరబాదర యర్చన సమయ మధిగమించకుండ - కాయకర్పూరముతో ఫలపుష్పాదులతో శ్రీ విరూపాక్ష కళ్యాణమంటపమును జేరినాడు. నోటిలో నేదో గొనుగుకొనుచు నాలయాంతర్భాగమున కేగి "నారికేళం సమర్పయామి ఫల పుష్ప పత్ర తోయం సమర్పయామి" యని మంగళహారతినిచ్చి కొబ్బెరగిన్నెలతో బయటఁబడి బిరబిర బిళ్ళగోచిని సవరించుకొనుచు గృహోన్ముఖుఁడై నాడు.

పాంథుల దోచు బందిపోటులవలెపొంచి యాత్రికుల నిర్దాక్షిణ్యముగఁ దోచు వానరయూథమున కాదేవాలయ ప్రాగ్ద్వార గోపురము నిలయము. నృసింహాకవిని గనిపెట్టిన వనచరమొక్కటి యాతనిపై గవిసి కొబ్బెరగిన్నెను గుంజుకొని పోయెను. బిక్కమొహంతో దిక్కుల బరికించుచున్న నృసింహా కవిని సమీపించి యొకానొక పుణ్యుఁడు భూపతనమైన పుష్ప పత్రాదులనేరి యాతని కరములందిడెను.

నృ-కవి:- అభినందనములు. తమ నామధేయము ?

వ్యక్తి:- నా పేరు మాదయ్యగారి మల్లన్న. నృసింహా కవిగారు మీరేనా?

నృ-కవి:- అవును. మీరు రాజశేఖర చరిత్రమును రచించుచున్నారని వినికిడి. అయ్యది సత్యదూరము గాదుగదా?

మా-మల్లన్న:- రాజదర్శనమైనదా?

నృ-కవి:- పెద్దన్నగారి పెత్తన మాస్థానమునుండి వైదొలఁగనిదే మనబోటివారిని బలుకరించునదెవరు?

మా-మ:- ధూర్జటికవి మీ బసయందే గలరా?

ముందువెనుకల మూర్తీభవించిన పోతన శ్రీనాథులో యనునట్లు వారివురు కొలదిసేపటికే బసఁజేరిరి.

ధూర్జటికవి తదేక ధ్యానముతోఁ గవికర్ణరసాయనమును బఠించుచున్నాఁడు. మాదయ్యగారి మల్లన్న ధూర్జటికవికి నమస్కరించినాడు. కూర్చుండ నియోగించి కుశలప్రశ్నల నడిగినాడు ధూర్జటికవి.

మా_మః కవివరా! కవికర్ణరసాయనమున నే ఘట్టమున నున్నారు?

ధూ_కవిః_ హృదయావేదన ఘట్టమున - పురోభాగి దూషణ మున నున్నాను.

మా_మ:_ నిరంతర రంధ్రాన్వేషి పురోభాగి యనబడుగదా!

ధూ_కవి:_ఇమ్మహాత్ముఁడు పురోభాగి దూషణమున వారిని గాడిదలని సెడదిట్టినాడు. ఈతఁడు సత్కవి ప్రశంస_ కుకవినింద_పురోభాగి దూషణాదులను గొంగ్రొత్త పథమున నడిపించినాడు. ఇట్టిరచనములు ప్రతిపతులకు హృదయశల్యముగ దోపకమానదు.

మా_మ:_ ఈ యాగ్రహావేశములకు బెద్దన తిమ్మనలే కారణ భూతులై యుందురు.

నృ-కవి:_ సాహిత్యచర్చలోఁబడి భోజనమునే మరచినట్లు న్నదే. లెండు. కడుపునిండితే కావ్యచర్చసాగినట్టే!

# 5

ఖడ్గమునుబట్టి సమరాంగణముల భుజబలముసూపి రాజులు సామ్రాజ్యవిస్తృతిఁ బాటుబడుదురు. కలమును బట్టి కవిరాజులు సాహిత్యరంగమున బుద్ధిబలముతో నన్యసామాన్యమైన సారస్వతసేవ నొనర్తురు. రాజులు_కవిరాజులు ప్రజానీకమున సమానమైన గౌరవప్రతిపత్తుల సంపాదింపఁగల్గు చున్నారు. "నావిష్ణుఃపృధివీపతిః" యన్నట్లే "నా నృషిఃకురుతే

కావ్యం" యను లోకోక్తి సార్థకమగుచున్నది. "కవయః క్రాంతదర్శినః" కవులు దివ్యదృష్టిగలవారని నుతింపబడుచున్నారు. నవనవోన్మేషశాలినీయుక్తమగు ప్రజ్ఞ-ప్రతిభ యనబడును. అట్టి ప్రతిభాన్వితుడై వర్ణనాకౌశలమును జూపువాడే కవియని ప్రవచింపబడినది. ప్రతిభావంతుఁడైన కవి కావ్య ప్రపంచమును సృజించుబ్రహ్మ. కవి శృంగారియైనచో నీరసలోకమును శృంగారమయముగను విరాగియగుచో మయముగను జిత్రించును. "లోకోత్తరవర్ణనానిపుణ కవికర్మ కావ్యం" అను నానుడినిబట్టి లోకోత్తర వర్ణనా నైపుణ్యవిలసితుఁడే కవియని నిర్వచింపబడినది.

పురాణయుగమునకు నన్నయ తిక్కనలును కావ్య యుగమునకు శ్రీనాథ పోతనలును ప్రబంధయుగమునకు పెద్దన్న నృసింహకవులును తమకవితా ప్రాగల్భ్యముతో మెరుగులు పెట్టిరి. శ్రీకృష్ణదేవరాయ లాముక్తమాల్యద యందు జూపిన వర్ణనాధిక్యమును నృసింహకవి కవికర్ణరసాయనమున విపరీతవైపుల్యముగా వించి యాంధ్ర భాషామతల్లికొక దివ్యాలంకారము నొడగూర్చినాడు. కృతిప్రశంసలోని కవిప్రతిజ్ఞయే యిందులకు నిదర్శనము.

గీ. యతివిటుడుగాక పోవుటెట్లస్మదీయ కావ్యశృంగార వర్ణనాకర్ణనమున
విటుడుయతిగాకపోరాదువెనమదీయ, కావ్యవైరాగ్యవర్ణనాకర్ణనమున

ఇట్టి యప్రతిహతమైన ప్రతిజ్ఞను నెగ్గించిన ప్రతిభాన్వితుడు నృసింహకవి. ప్రతిజ్ఞ నెరవేరినదా లేదా యన్న ప్రశ్న వేరు. తన శృంగారవర్ణనమును జవిచూచిన సన్యాసి సైతము

సరసిజాతుల చరణాబ్జములపై వ్రాలి మత్తమధుకరమువోలె మధుకరము మాని భోగికాకపోడనియు-వైరాగ్య వర్ణనాకర్ణనమున విటుఁడు సర్వసంగ పరిత్యాగమొనర్చి సన్యాసిగా సంచరింపక మానడనియు-నరసింహాకవి యుద్దేశ్యము.

ప్రబంధ పదనిర్వచనమీ క్రిందివిధముగ కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిచే మనుచరిత్ర పీఠికలో 4వ పుటలో వివరింపబడినది. "మిశ్రశ్రోత్రాద్యాన్యతరమగు నితివృత్తముతో జతుర్దశవర్ణనలగూర్చి రచింపబడు కావ్యమునకుఁ బేరుగాఁ బ్రబంధపదము వాడబడుచున్నది" ప్రబంధమున నష్టాదశ వర్ణనములుండవలెనని ప్రతాపరుద్రీయమున బేర్కొనబడినది. పుర, సముద్ర, శైలఋతు, సూర్యోదయ, చంద్రోదయ, జలక్రీడా, వనక్రీడా, వసంత, రతిప్రసంగ, విరహ, పరిణయ, పుత్రోదయ, నయవిరచన, దండయాత్రాయుద్ధ, ద్యూత, ప్రభువర్ణనాదులు వివరింపబడినవి. శ్రీకృష్ణదేవరాయకృతమైన యాముక్తమాల్యదయందును, రామరాజభూషణకవి ప్రణీతంబైన వసుచరిత్రమునందును, వర్ణనము లెక్కువగనున్నవి. ఏ ప్రబంధమందును గాన్పింపని వర్ణనలు గవికర్ణరసాయనమున నున్నవి. మొత్తము నలుబదియైదు వర్ణనలుగల ప్రబంధమది. ప్రప్రథమ ప్రబంధన మనబడు మనుచరిత్రమును బరిశీలించి కథావేగము నడ్డు వర్ణనలు బనికిమాలినవని గుర్తించి నందితిమ్మన వర్ణనలఁ దగ్గించినాడు. ప్రబంధములలో బ్రసిద్ధికెక్కిన పారిజాతాపహరణమున తిమ్మన తక్కువవర్ణనలతోఁ గథావస్తువును దీర్చిదిద్దినాడు.

నృసింహాకవి తోడి కవుల మెప్పించుటకై వర్ణనావై శద్యమును జూపెనేగాని కథావేగమున కయ్యవి ప్రతిబంధకములని గుర్తింపజాలక పోయెను. తన కావ్యము గవులకుఁ గర్ణరసాయన మొనర్చినను ప్రజాబాహుళ్యమునకుఁ గషాయముగఁ బరిణమించినది. పెక్కువర్ణనలున్న పెద్దన్నకంటె మించిన పెద్దరికము తనకు లభించునని యూహించినవాఁడు నృసింహా కవి.

## 6

నృసింహాకవి మిశ్రకావ్య ప్రశంసమును దిలకింతము.

గీ. కావ్యముత్పాద్యమైన సత్కావ్యమింకఁ
నుక్తకావ్యంబయే పునరుక్తిఁ దెచ్చుఁ
గానఁ గవితాభిముఖుడైన కవివరునకు
మిశ్రకావ్యంబె కావ్యమై మెరుగుఁదెచ్చు॥

ప్రఖ్యాతము - ఉత్పాద్యము - మిశ్రము అని కావ్య భేదములు త్రివిధములు. పురాణ ప్రసిద్ధములయిన రామాయణాదులు ప్రఖ్యాతములనబడును. కేవలము కవి కల్పితములైన కళాపూర్ణోదయాదు లుత్పాద్యములనబడును. కొంత పురాణప్రసిద్ధ కథయు, గొంత కవి కల్పితమునైన కథావస్తువు గలది మిశ్రకావ్య మనబడును. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు తన శృంగార శాకుంతలమున మిశ్రకావ్యమేవక్తకు మెరుగుఁ దెచ్చునని వాకొన్నాడు. నృసింహాకవి "వక్త" కనక "కవి

వరువ"తని చెప్పుకున్నాడు. కవిశ్రేష్ఠులే కవికర్ణరసాయనముగఁ గావ్యములవల్ల గలదని స్వాతిశయముగ వచించినాడు.



కీ. శే. గురజాడ శ్రీరామమూర్తిగారు "కవిజీవితము" లలో 457 పుటలోఁ బ్రౌఢకవులని బిరుదుగాంచినవారి పట్టికలో నీ నృసింహకవిని జేర్చియున్నారు. వర్ణనావైచిత్ర్యము నపారముగఁ జూపనెంచియే కాబోలు నృసింహకవి మిశ్రకావ్యము నేగోరి రచించినట్లు గోచరించుచున్నది. ఈతడు విద్వత్కవియైనట్లును-నవిద్వత్కవుల కావ్యము జారిణీజార నవహాస్సంగమమువలె నుండుననియు తన కావ్యమున జతుర్థాశ్వాసమున 107వ పద్యమున వివరించినాడు. ఆనాటి కృతికర్తల కృతిభర్తల మనమున నిడుకొని విద్వత్కవులకు లభించని యవకాశమును గారణముగఁగొని ధ్వనికృతముగ నిట్లు నుడివి యుండవచ్చును. ఆంధ్రకవితా పితామహుఁడయి కవి గండపెండేరాదులచాల్చి-యాందోళికలనెక్కి యూరేగు పెద్దన్నగారిమాట కెదురులేని యా నిరంకుశ ప్రభుత్వములో నృసింహకవివంటి కవులెందరు రాజదర్శనము లభింపక నిరాశా ప్రపీడితులై వెనుదిరిగిరో ఎవరు భోగట్టానివ్వగలరు.

ఈ కవితల్లజు నాత్మసంతృప్తి యీ క్రింది పద్యమున విశదమగుచున్నది.

క. ఎల్లరుమెచ్చనిమత్కృతి; నల్లంబువమెచ్చుగాక యొకదుష్టకులం
బొల్లనివల్ల విశ్రామముఁగొల్లలుగాఁబొగడనొక్కకోయిలలేదే॥

తన్ను దిరస్కరించిన పెద్దన్న మృగజాతికి జెందిన వాడనియు, మృగములలో నుష్ట్రము మిక్కిలి పెద్దదనియు, నాజంతువుచే దిరస్కృతినొందిన మామిడి చిగురుల కెట్టిలోటు పాటులు రాపోయినట్లే దనకు గౌరవలోపము సంభవించలేద నియు, కోయిల పల్లవితామ్రమును ప్రేమించినట్లే తన కృతిని ప్రేమించువారుందురనియుఁ దృప్తిఁబొందినాడు. కావ్యమును నరాంకితమొనర్చి నరలోకము ననుభవించుటకంటె భగవంతున కంకితమిచ్చి పరమపదము నొందుట శ్రేయోదాయకమని నిశ్చ యించుకొన్నాడు నృసింహకవి.

# 7

కాలకృత్యాదుల నిర్వర్తించి, పూజా పునస్కారము లాచరించి సాహిత్య చర్చను సాగింప ధూర్జటికవి మాదయ్యా గారి మల్లన్న లాయత్తులైనారు. నృసింహకవి తన కావ్యమును ధూర్జటి కరకమలముల బెట్టినాడు.

దూరప్రయాణ మొనర్చుటచే గాబోలు పాదములు దొట్రుపడుచున్నను గమ్యస్థానముఁ జేర నాకాంక్షించు పుణ్యు డొకడు నృసింహకవి వసతిగృహమున బ్రవేశించినాడు, అట జరిగిన సంభాషణారూపమిది.

నృ-కవి:- మిత్రమా! రామభద్రా! యెటనుండిరాక?

అ-రా:- ఒంటిమిట్టనుండి.

నృ-కవి:- తాళ్ళపాక వారు కుశలమా?

ధూ-కవి:- రామభద్రకవీ! మీరామాభ్యుదయము సమాప్తమైనదా?

అ-రామ:- సమాప్తమైనది.

మా-మ-కవి:- శ్రీకృష్ణదేవరాయల మన్ననల నొందనున్నదా?

అ-రామ:- రాయల దర్శనము మీకు లభించినదా?

ధూ-కవి:- రాజదర్శనము లభించని కారణమే కావ్యావతారికాభాగమున చేర్పులు, మార్పులు గావింపవలసిన కార్యభార మేర్పడినది. నృసింహకవి ప్రతిజ్ఞావాగ్విలసనము నాకర్ణింపుడు.

క. నేరిచినసుకవికృతిచేఁ బేరెఱిగించికొనిజగతి బెంపగుటొప్పున్
నేరకకృతిచెప్పుట తగ నేరమి యపకీర్తి జగతివిలువుటగాదే॥....

అ-రామ:- నిజము. సుకవీంద్రులు సత్కావ్యముఖముననే తమ పేరు ప్రతిష్టల నెలకొల్పుకొన నుద్యమింతురు.

ధూ-కవి:-

క. ఏరసముచెప్పబూనిన, నారసమాలించువాని నలరించవియా
నీరసపుకావ్యశవముల దూరమునఁ బరిహరింపుదురు నీతిజ్ఞుల్॥

మా-మ-కవి:- నీరసపుకావ్యశవముల బరిహరించిన విధము బలే బాగున్నది.

క. చెప్పఁదగుఁగవితరసముల్ చిప్పిలనప్పప్పబళిబళీ యనలేదా!
యెప్పుడు చెప్పకయుండుటె యొప్పునుమీ సువికయెంతయుచితజ్ఞుఁడోకో॥

అ-రామ:- వల్లకకవీ! తను రాజశేఖర చరిత్రమునుండి యీ పద్యమును జదివితిరా?

ధూ-కవి:-

క. కలకంఠకలనచూపక! కలకంఠంబూరకున్నఁగా కమకాదే!
కలిత విజవాగ్విలాసం బలరింపని తజ్ఞుఁడైన నజ్ఞుఁడుకాదే॥....

అ-రామ:- కవులకు, కాకవులకుఁగల తారతమ్యము కలకంఠ కాకములకున్నంత గలదనుట నిర్వివాదాంశము. మధుర మంజుల గానాలాపమున సర్వప్రపంచమును దన్మయత్వమున ముంచు కలకంఠము కంఠమును విప్పకున్న కాకిమూకలోఁజమగట్టఁబడును. అట్లే సుకవులు నిజవాగ్విలాస వైఖరులఁ జాటకున్న కుకవి గుంపులోఁ జేర్పబడుట యదార్థము.

న్రృ-కవి:- విశ్రాంతిగైకొనిన పిమ్మట, కావ్యచర్చను సాగింతము లెండు.

# 8

చైత్రయాత్రను నిర్విఘ్నముగ సాగించి విజయపరంపరలతో విజయలక్ష్మిని వరించి విద్యానగరమునకు మగిడి శ్రీకృష్ణదేవరాయలు చనుదెంచినాడు. తిమ్మరుసు మహామంత్రిని భావించి రాజకార్యకలాపముల జర్చించినాడు. చతురంక మాడ నభిలషించినాడు. ప్రియతనూజను మోహనాంగిని బిలిపించి యాటనాడ మొదలిడినాడు. ఇతరేతర

జయాభిలాషులై చతురంగ మాడుచుండ మోహనాంగి బంటు కృష్ణదేవరాయల మంత్రికిని యేనుగునకును మధ్యకు రాగా మోహనాంగి తికమకలు పడినది. చేయునదిలేక "ఉద్ధతుల మధ్యఁ బేదలకుండఁ దరమె" అను పద్యమును జదివినది. శ్రీకృష్ణదేవరాయ లందలి భావమును గ్రహించెను. "గుమ్మడి కాయల దొంగ యంటే బుజములఁ దడవు" కొన్నట్లు రాయల కేదో స్ఫురించినది. తన పాలనమున నెవరికో తీరని యపకారము వాటిల్లినదని గమనించినాడు. పద్యము నల్లిన దెవరని రాయలు తనయను బ్రశ్నించినాడు. ఆమె జరిగిన వృత్తాంతమును విశదీకరించినది.

ఆ న్యాయమునకు గురియైన యజ్ఞాత కవికిఁ దగిన మర్యాదను జూప నాలోచించినాడు. వెంటనే మోహనాంగి పరిచారికను బిలిపించినాడు. స్వయముగ నేదో పత్రమున లిఖించి నాలుగువేల వరహాలను ముట్టజెప్పి రమ్మని యాజ్ఞాపించినాడు.

## 9

నృసింహకవి దీపికా నివహంబు నెలకొల్పి తత్పురోభాగమున వ్యాసపీఠముపై తాళపత్ర గ్రంధము నాయుత్తమొనర్చి యెవరి రాకకో నిరీక్షించుచున్నాడు. కావ్యచర్చావ్యగ్రులై జనుదెంచు మల్లనాది కవులను మధ్యేమార్గమున భట్టుమూర్తి కలుసుకొనెను. అయ్యలరాజు రామభద్రుడు

తన మిత్రులకు భట్టుమూర్తిని పరిచయ మొనరించెను. రూప మును గైకొన్న చతుర్వేదములో యనునట్లు కవిచతుష్టయము గదలి నృసింహాకవి గృహమును జేరి.

నృ-కవి:- భట్టుమూర్తీ! యెందుండిరాక? గండికోట పురవరాధ్యక్షుఁడు పెమ్మసాని రామలింగనృపతి యాస్థానమున వార్తలేమి?

భట్టు-కవి:- కవివరేణ్యా! మొన్నటి దినమె భానుకోట సోమేశ్వరు సేవింపఁబోయి సుంకేశులమీదుగ బయనమును సాగించి మీ కుటుంబ యోగక్షేమముల సాదరాయత్తచిత్తుడై విచారించి సంభావనీయముగ సంభారముల బంపెనని వార్త దెలియవచ్చినది.

నృ-కవి:- పింగళిసూరన్నకవి గండికోటయందే గలడా?

భట్టు-కవి:- విజయనగరమునకే వచ్చినాడని వినికిడి.

ధూ-కవి:- శరన్నవరాత్రోత్సవములకై నేల నాలుగు చెఱగుల నుండి పలువురు కవులు విద్యానగరమున కేతెంచుచున్నారని వినియుంటిమి.

మాద-మః:- ఔనౌను. శ్రీకృష్ణదేవరాయలు కవుల కాహ్వానముల బంపెనట.

అయ్యల-రాః:- కవిసన్మానము, పండిత సత్కారము, పెద్దయెత్తున జరిపింప నెంచినట్లున్నది. కానిండు. కావ్యకాలక్షేపమునకు గడంగుడు.

ధూ-కవి:-

చ. తమకునయత్నసిద్ధముగ దానములై యలరించుభూపరా
గములన వానిచేఁ దమకుఁ గల్గెడు దానజలాతివృష్టిచే
సమయగఁ జేయఁజొచ్చెఁ బటుసైన్యమదేభకులంబులప్పు; వి
క్కమునదియట్లు మత్తులుపకర్తలకేనియుఁగీడుసేయరే.

(2-78)

భట్టు-కవి:- కవిపుంగవులార! ఇందలి శబ్దశ్లేషను గమనింపుడు. భూపరాగములనియు, భూప రాగములనియు పదద్వయమున నర్థమువచ్చునట్లు రచించినాడు.

మాద-మ:- భట్టుమూర్తీ! భావిశ్లేషాను ప్రాస చక్రవర్తివై శ్లేషకావ్యముల రచింపుము.

నృ-కవి:- మల్లనకవీ! మీయాశీర్వాదము ఫలించుగాక!

అ-రా-భ:- అర్థాంతరన్యాసాలంకారముల కీర్తఁ డగ్రగణ్యుఁడనక తప్పదు.

ధూ-కవి:- సీ. "కనురెప్పలిడనెరుంగనిమాడ్కి" — (అని పూర్తి పద్యమును జదువును. కవికర్ణరసాయనము. 1 ఆ 55 ప.)

భట్టు-కవి:- మాంధాతృ శైశవమును వర్ణించు ఘట్టమున పోతన్న శ్రీకృష్ణుని శైశవావస్థను వర్ణించిన దశావతారములు శ్లేషించి చెప్పినట్లే మన నృసింహకవి సెప్పియున్నాడు.

(సీ. "తోయంబులివియని తొలగకచొచ్చెను" — ద. పూ. 378 ప.)

అ-రా-క:- బమ్మెరపోతన్న పైగల గౌరవ ప్రతిపత్తులే యీ యనుకరణమునకు గారణము గావచ్చును.

మాద-మ:- పూర్వకవుల ననుకరించి సందర్భానుసారముగ మెఱుగులు వెట్టి మెలకువఁజూపిన వారిలో నీత డగ్ర గణ్యుఁడు. శ్రీరంగమహాత్మ్యకారుడు భైరవకవి శ్రీరంగ శాయిని వర్ణించుటపట్ల సచ్చ తెనుగుపదముల మిక్కుటముగఁ బ్రయోగింప మన మిత్రుడు సంస్కృత పదభూయిష్ఠముగ వర్ణించినాడు.
(శ్రీరంగ-1 ప్ర-108 ప—కవికర్ణ—1 ప్ర.40 ప)

ధూ-కవి:-మనసముకాలికులే కొందరితని భావములకు మెఱుగులు వెట్టిరి. తెనాలిరామకృష్ణుఁడట్టివారిలో నొక్కఁడు.

చ. ఘనకుచకుంభయుగ్మ మెదిగై కొననీక వియోగవార్ధిలో
నసుమును గించుభావమున నాజలజాయతనేత్ర శయ్యపై
ననయము నల్లమైనకట, యవ్వలి మోమయి? తైననేమి? తా
వినుతకటీతటీపులినవీథి వసింపఁగఁగల్గెఁ జాలదే

—(కవికర్ణ 4- 55)

మా-సు-కవి:- తెనాలిరామకృష్ణుఁడు తనస్వర్ణయోగ చింతామణిలోని వ్యాఘ్రాజిన శయ్యాసందర్భములో యోగి భోగినీ సంవాదనమున నీపద్యభావమునే ప్రకటించి నాడు. ఆ పద్యమిది:

మ. వరబింబాధరమున్ పయోరుహముఖంబున్ వక్రాలకంబుల్ మనో
హరలోలాక్షులు నూపకవ్వలిమొగంబై నంతనేమాయె; నీ
గురుబాస్వజ్జఘనంబు గొమ్మ డియు మాకుంజాలవే? గంగక
ద్దరిమేల్దిర్ణకి మను గలదె యుద్యద్రాజబింబాననా॥

భట్టు-కవి:- ఇమ్మహానుభావుఁడు శబ్దార్థాలంకార రచనా విషయమున నిరుపమానమగు నైపుణ్యముతో నితర కవుల నతిక్రమించినాఁడు.

నృ-కవి:- మనకు వేళ యతిక్రమించినట్లు దోచుచున్నది.

ధూ-కవి:- నిద్రాదేవి యాసన్నమగుచున్నదా?

నృ-కవి:- రేపేగదా నవమి. రేనిదర్శనము లభించిన గదా మనమర్యాదలు దక్కుట.

## 10

ఆనాఁడొక పవిత్రమైన పర్వదినముగఁ బరిగణింపఁబడు చున్నది. విద్యానగర పురవీధు లలంకరణములతోఁ గలకల లాడుచున్నవి. ఎచ్చట చూచినను బచ్చతోరణములే, ఏ వంకఁ దిలకించినను గళ్యాణమంటపములే, ఏ క్రేవ దృష్టిఁ బ్రసా రించినను శిల్పకళా పరిశోభిత సుందర సౌధరాజములే, ఏవైపు కన్ను గదల్చినను కాంచనాద్రిని దెగడు నవరత్నరాసులే, ఏ చక్కి చతుద్వయపాతము పాతరలాడినను ధాన్యరాసులే గోచరించుచున్నవి. ఆ సువిశాల విపణివీధుల పుష్పలావికావి తతి సరసంపుపలుకులతో గులుకులాడుచున్నవి.

ఆనాఁడు కవిసన్మానము,పండితసత్కారము,శిల్పనైపుణ్య ప్రదర్శనము, సంగీతకాలక్షేపము జరుప నిశ్చయింపబడినది. కవి గాయకుల శక్తిసామర్ధ్యములఁ బరీక్షించి బహూకరింప నెంచి నదా దినము. కావ్యకన్యామణుల వరించి శ్రీకృష్ణదేవరాయలు మంగళసూత్రములఁ గట్ట నిశ్చయింపఁబడినదా శుభదినము,

ఆస్థానమున నష్టదిగ్గజ కవుల నెలకొల్ప నిర్ణయింపబడినదా దినము. ఆ దినమే నవమి.

పూర్వమే ప్రదేశము శారదాదేవికి నిలయమై శ్రీనాథ కవిసార్వభౌముని దీనారటంకాలఁ దీర్థమాడించినదో యా దక్షిణాధీశు ముత్యాల శాలయే కొద్దిమార్పులతోఁ గూర్పులతో భువనవిజయ మనఁబడుచున్నది. నే డనన్య సామాన్య శిల్పనైపుణ్య వైభవాతిశయములతో విలసిల్లుచున్నదా భువన విజయము. సాహిత్యగోష్ఠి సదనమనియు, కవిసంతానంబులఁ గనికరించు భూలోక సంతానమనియు, గాయకని కరంబునకు గామధేనుమనియు బ్రసిద్ధికెక్కినదా భువనవిజయము. ఆంధ్ర కవితా పితామహుఁ డల్లసాని పెద్దనామాత్యునకు స్వయముగ రాయలు గవి గండపెండేరమును దొడిగి మన్నించినదీ భువన విజయమందే. పారిజాతాపహరణ రచనా ధురంధరుండగు నంది తిమ్మన కవి కావ్యకన్యక కీభువనవిజయమే కళ్యాణమంటపమై కన్నులపండు వొనర్చినది. "ముక్కు తిమ్మనార్య ముద్దు పలుకు" అని రాయలీ భువనవిజయముననే కొనియాడి యా కవిపుంగవు గౌరవించినది. అట్టి శారదానికేతన మీనాడు సమస్తాలంకారములతో నొప్పుచున్నది.

సభాసమయము సమీపించినది. అంతఃపుర ప్రాంగణమున మంగళవాద్యములు మ్రోగినవి. గజఘటల ఘీంకారములు, హయావళి హేషారవలి, మిన్నుముట్టుచున్నవి. రాజలాంఛనములతో రాయలు వేంచేసి మదగజేంద్రముపై నాసీను

డగుచుండ పౌరకాంతలు లాజలు సల్లిరి. నలువైపులనుండి పూలవాన గురిసినది. మదగజ రాజము మందగమనముతోఁ బురోగమించినది. మహామంత్రి తిమ్మరుసు పురోభాగమునఁ బాదచారియై నిబ్బరముగఁ గదలినాడు. సామంత నృపాలు రాతని వెరుంత మెలమెల్లగఁ బయనమును సాగించినారు. వారి వెంట కవిగండపెండేరముఁడా కాలనొప్ప గాశ్మీరు శాలువను గప్పి, "ఆంధ్రకవితా పితామహ" యను బిరుదాక్షరములతో మెరుగులీను కనక కంకణమును దక్షిణహస్తమున ధరించి వచ్చువా డల్లసాని పెద్దనామాత్యుఁడు. ఆయన వామభాగమున ముక్కుతిమ్మనాది కవులు, పండితులు, గాయకులు, శిల్పులు బయలుదేరినారు. వేత్రహస్తుల కైవారములు, వందిమాగధుల స్తోత్రపాఠములు, పౌరుల జయజయ నినాదములు పెచ్చుపెరిగి వియత్తలము నందుకొన్నవి.

మత్తేభ మాగినది. శ్రీకృష్ణరాయాధిపుడు మహామంత్రి యిచ్చు కైదండతో గజమును దిగినాడు. భువనవిజయమునఁ బ్రవేశించినాడు. మందిరము ప్రజానీకముతోఁ గ్రిక్కిరిసినది. వేదికపై నమర్చబడిన నవరత్నఖచితాసనము నలంకరించినాడు రాయలు. తత్తదర్హాసనముల నర్వులాసీనులైనారు. దమయంతీ స్వయంవరమునాటి పంచనలులవలె కవి పంచకమాసనముల నలంకరించినది.

కరతాళధ్వనులమధ్య నధ్యక్షస్థానమున రాయలు లేచి నిలబడినాడు. "సదస్యులార! కవిపండితులారా! మా పూర్వా చార ప్రకారము శరన్నవరాత్రోత్సవములజరిపించి, కవి సత్కార మొనర్పఁ దలఁచితిమి. అంతేగాక నా యాస్థానమున నష్టదిగ్గజ

కవుల నియమింప నిశ్చయించితిని. ఆస్థానకవులుగ నుండగోరు వారు తమ తమ కవితా పాటవముఁ ప్రదర్శింతురని గోరు చున్నాను" అని రాయ లనెను.

అంత సంకుసాల నృసింహకవి వేదికనెక్కి రాయల నాశీర్వదించి యిట్లనియె. "శ్రీమన్మహా రాజాధిరాజా! కవి కల్పభూజా! కావ్యరచనాధురీణా! నావిన్నప మాలకింపుము. నేను "కవికర్ణరసాయనము" అను కావ్యమును రచించితిని. అవాంతర కారణములు నన్నడ్డగించినవి. మీ దర్శనభాగ్యము లభ్యపకపోయినది. అస్మదీయ కావ్య శృంగారవర్ణనా కర్ణనమున యతి విటుడుగాకపోరాదు. విటుడు వైరాగ్య వర్ణనా కర్ణనమున యతిగాక పోరాదు విచిత్రవర్ణనా వైశద్యమున రచించిన కావ్య రాజమును సాంగోపాంగముగ నాకర్ణింప గోరితిని" అనెను.

ఇంతలో నంతరాయమేదో సంభవించినది. పాండ్యుని కటుదోకడు తిమ్మరుసు కందింగిన కమ్మయే యందులకు గారణము గానోపు. మహామంత్రి రాయల చెవిలో నేదో చెప్పినాడు. రాయలు నృసింహకవితో "మహాకవి! మీ కావ్య మును బరామర్శింప వ్యవధిలేదు. మిమ్ము నా యాస్థాన కవు లలో నొక్కనిగ గైకొనుచున్నాను. ఇప్పటినుండి యష్టదిగ్గజ కవులలో మీ రొకరుగ బరిగణింపబడుదు" రని చెప్పి వెడలి పోయెను.

ఆనాటికి సభ చాలింపబడినది. అష్టదిగ్గజ కవులలో నొకరై నృసింహకవి యాస్థానకవులకై నిర్మింపబడిన నివాస స్థానమున కేగెను.

## 11

కవికర్ణ రసాయన మాఱాశ్వాసముల ప్రౌఢ కావ్యము. ప్రథమాశ్వాసమున కావ్యారంభము, పురవర్ణనము, నాయక నిరూపణము, ద్వితీయాశ్వాసమున రాజనీతి, శరత్కాలవర్ణ నము, దండయాత్ర, దిగ్విజయము, సేనా సన్నివేశనిరూప ణము, దూతాలాపమును, వీరాలాపమును, యుద్ధశైల వర్ణ నములును, తృతీయాశ్వాసమున నాయికా నిరూపణము, యౌవనవర్ణనము, విప్రలంభంబును, నందలి దశాభేదంబులును, వివాహము, నవనవోఢా సంగమంబును, చతుర్థాశ్వాసమున వసంతవర్ణనము, వనవిహారము, జలక్రీడా వర్ణనము, సూర్యాస్త మయము, తమోతారకా వర్ణనము, జారవిటవిటీ వర్ణనము, చంద్రోదయము, మధుపానము, రతి నిరూపణము, ప్రభాత వర్ణనము, సూర్యోదయ వర్ణనమును, పంచమాశ్వాసమున వసిష్ఠాగమనము, రాజప్రశ్న ప్రతివచనంబులు, కర్మస్వరూప బ్రహ్మస్వరూపములు, వేదవేదాంత పురాణ నిరూపణము, భక్తి ప్రపత్తి రూపసాధన నిరూపణము, సంసార నిరూపణము, మోక్షావతరణమును, షష్ఠాశ్వాసమున తపశ్చరణము, ఋతు వర్ణనము, అప్సరస్సమాగమనప్రకారము, వృత్త ప్రపంచము, సముద్రవర్ణనము, వైకుంఠ వర్ణనము, భగవద్దివ్యమంగళ వర్ణ

నము, జగదలో స్సుస్తోత్ర మిత్యాదులతో నలువదియైదు వర్ణనలు చెప్పబడినవి.

# 12

జాతరూప మనోజ్ఞ జాతరూపంబైనకోట జాతరూపశైలము నోటుబరుపుచుండ, మధుసుధారసపూర మధురాంబుమయం బైన పరిఘవారాసిని భంగమొనరించుచుండ, నవరత్న చిత్రాభి నవయత్నకములయిన భవనంబులు. బంగారుకొండను బరిహ సించుచుండ, కమలాసనుండు కడుచిత్రముగ కమలాపత్తికుల జాలకై విమతవ్యూదయ ఘట్టణంబైన పట్టణరాజమును నిర్మించె నోయన సాకేతపట్టణ మొప్పుచుండెను. సర్వసంపదలతోఁ దుల తూగు నమ్మహాపట్టణమును దన కీడుజోడులేని వైభవమున నష్టదిక్తటీవాట్ట చంద్రప్రతాప హారిదశ్వుఁడన బ్రఖ్యాతికెక్కిన యువనాశ్వుఁ డేలుచుండెను.

ఆ రాజోత్తముం డొక్కనాడు మృగయావ్యాసక్తిఁ గాంతారంబున కేగి దప్పిఁబడి ఖిన్నస్వాంతుడై యొక్క మున్యాశ్రమంబు దరిసె. అందెవ్వరిని గానక కందుకములోని తెల్లని యండంబునుగాంచి చేతఁబట్టి పరిశీలించుచుండ విధివశం బున నయ్యది హస్తస్రస్తమై భూస్థలినిబడియె. భయభ్రాంతుడై యా భూకాంతుడా ప్రదేశంబును వదలి చనియె.

ఆ శ్రమంబునకుఁ దిరిగివచ్చిన ముని యాండంబవిసిన దాని కడలి యండళంగం బొనర్చినవాఁడు గర్భమవసి చచ్చుఁగాక యని శపించె.

యువనాశ్వుండు పురంబు జేరి సంతానంబు లేమికి గుందుచ దపోనిష్ఠాగరిష్ఠుండైన వసిష్ఠమహర్షి యా దేశంబున నింద్రయాగము నేసెను. హోతలు వేదమంత్రాభి మంత్రితాక్షములు సల్లిన కలశోదకము దెచ్చి వజ్జలంబులుఁ గ్రోలిన ప్రాణికి వేలావలయిత ధరణిం బాలింపఁ గలుఁగు చక్రవర్తి జన్మించునని యెరిగించిరి. ఆ రాత్రి జాగరము నేసి నృపోత్తంసుండు మౌనివాక్యం బమోఘముగాన తెలివిదప్పి దప్పికా నీరు ద్రావెను. గర్భమునిల్చి దుర్భర తీవ్రవేదనల దూలుచు నెల్ల వాలగా నయ్యినకులాగ్రణి గర్భమగల్చికొంచు నర్భకుం డొక్క డావిర్భవించెను. యువనాశ్వుని చావుగాంచి విడిపోయిన వేణిబంధములతో, వేవేగ నంతఃపుర కాంతలు రొమ్ములు బాదుకొంటు వసిష్ఠు సమీపించి పతిభిక్ష దయనేయుమని ప్రార్థించిరి. వసిష్ఠుం డింద్రుఁ బ్రార్థించెను. స్వర్గలోకనాధుండు సవనవాటికిఁ బ్రత్యక్షమై యువనాశ్వుని బ్రతికించి, నిజకరాంగుష్ఠంబు తద్బాల వక్త్రవివిష్టంబుగఁ జేయువాఁడును సుధాప్రస్యందముం గ్రోలెను. అప్పసిపాపని మాంధాతృ సమాఖ్యుఁజేసి హరి యంతర్ధానమొందెను.

దినదిన ప్రవర్ధమానుండై మాంధాతృండు సమస్తవిద్యల గురునికడ నభ్యసించెను. వార్ధక్య కతంబున యువనాశ్వుండు

పుత్రునకుఁ బట్టాభిషేకం బొనర్చి ఏకచ్ఛత్రాధిపత్యంబున
భుజగణ్వతిరేఖంబున బూర్వాస్తాచల మధ్యదేశ నివాస భూపాల
మౌళి స్ఫురద్గిర్వాణాధిపరత్నరుఙ్మ మధుకరోద్దీప్యత్పదాబ్జుం
డవై రాజ్యంబుం బాలింపుమని యాశీర్వదించి నిజకులాచార
ప్రకారంబున వానప్రస్థాశ్రమంబు స్వీకరించెను.

మాంధాత మహీవరుండు మహాసామ్రాజ్య భారంబు
గైకొని పటుప్రతాపవంతుండై ప్రజలఁ బాలించుచుండి దిగ్జయ
యాత్రాసరంభ విజృంభితాటోపుండై చైత్ర ప్రస్థానభేరి
వేయించి స్వర్గలోక జయకాంక్షనేగి మేరుశైల ప్రాంతంబున
నంబుజహితుం డపరాంబుధిం గ్రుంకక మునుపే దండువిడిసె.

విశ్రవిద్రాణుండైన రావణుండు విశ్వవిజయధాటీ
సమాటోపంబునం బాతాళ భూర్భువనంబు లాక్రమించి సుర
లోకంబునకేగి సునాసీరు నోడించి మగిడి లంకామార్గంబుఁ బట్టి
నికటనగోపరిస్థలంబున విడిసి యాకొన్న బెబ్బులికి మేకల
కూతయుంబోలెఁ బరసైన్య కలకలంబు వినంబడిన దూతనంపి
విషయంబుఁదెలిసి మాంధాతృపై దాడివెడలెను. మాంధాత
రావణు లొండొరుల నధిక్షేపించుకొనుచు బోరు సమయంబున
హెచ్చిన రోషంబును బెచ్చుపెరిగి దశకంధరుండు చంద్రహాసం
బును మించిన ద్వేషంబున భూవిభుండు పాశుపతాస్త్రమును
బ్రయోగింపఁబూనిన శివుండు ప్రత్యక్షమై వారిరువురుందుల్య
ప్రభావాధికులని చెప్పి యుద్ధంబు మాన్పించి యంతర్ధానం
బయ్యెను. అటనుండి తరలి మాంధాత మందర పర్వతంబున

కుంజని జయ స్తంభముల నాటించి దేవేంద్ర పూజితుండై పురం బునకుం జనియె.

కుంతలపతి జయభద్రుండను వానికభినవ తారుణ్యా భువనైక గణ్యయగు విమలాంగి యను గూతురు గలదని చిత్రకారులవలన విని మాంధాతృ మహీమండలేంద్రుం డక్క న్యపైని ప్రేముడివలన మదన వికృతిక్రమాక్రమ్యమానుడై యుండెను. కుంతలేశ్వరుండును చిత్రకారులవలన మాంధాతృ మహిమాతిశయంబులఁ దెలిసి నిజనందనను రావించి చిత్ర పటంబుఁ జూపించెను. విమలాంగియు నా రాజనందను బరిణయ మాడ నిచ్చగించెను. తదనంతరంబు జయభద్రుండు మాంధాతృ మహీపాలుఁ డంపిన దూతవాక్యానుసారము ముహూర్తంబు నిశ్చయించి శుభలేఖను బంపించెను. మాంధాతయు సంప్రాప్తా భీష్ట మనోరథంబగుటకు భావంబునంబొంగి నిజబంధు సామంత సేనాసమేతుండై యయోధ్యా నగరంబునుండి కుంతల దేశంబు నకుం జనియె.

ఇట్లు పౌరవిలాసినీ దృక్చకోర చంద్రుండగు నా రాజ చంద్రుండేగుదెంచిన కుంతలేశ్వరుం డుచితోపచారంబులఁ బ్రీతుఁగావించి మహూర్తంబు సమీపించినదని విప్రులవలనం విని గురుజన పురస్సరంబుగాఁ గళ్యాణరంగమునకు వధూవరుల రావించి వివాహమహోత్సవంబు నతివైభవంబున జరిపించెను.

కొంతకాలంబు కుంతలదేశంబున గాలంబుగడిపి భార్యా సమేతుండై మాంధాతపురి కేగుదెంచి కనక కంకణ ఘుణ

త్కార సంకులముగా సారసనేత్రలు వీచోపులిడుచుండ, మంత్రి సామంత హిత కవి గాయక వీరసమితి గొలువ, వందిమాగధులు బిరుదవాచకంబులుం బాడ, విబుధోత్తము లాశీర్వదింప, సకల దేశాధినాధులు దర్శనము నడయ నిండుకొలువుండెను. తత్సమయంబున వసిష్ఠ ప్రముఖ మహర్షులరుగుదెంచినం బ్రహర్ష పులకితాంగుండగుచు సాష్టాంగ దండ ప్రమాణంబుచేసి పురోనిర్దిష్ట మార్గుండగుచు నంతఃపురంబునకుంగొని చని తగు సపర్యలం బరితుష్టులం జేసి నృపకుంజరుండు గురువరేణ్యు దిలకించి "మహాత్మా! మున్నెట్టి నోములనోచి నేనిట్టి మహత్తరమైన జన్మంబును గాంచితినో నాకే యద్భుతావహముగ నున్నది. కాన, కరుణామతివై మదీయ పూర్వజన్మ వృత్తాంతంబును సాంగోపాంగంబుగ నెరింగింపవే" యని వేడుకొనెను.

గురువరేణ్యుండు ముహూర్తమాత్రంబు పరిత్యబహిరింద్రియుండై యోగసమాధివశంబున నయ్యర్థంబుగాంచి ప్రసాద సుముఖుండగుచు నమ్మహారాజవరేణ్యున కిట్లనియె. "సూర్యకుల ప్రదీపా! ముందు జన్మంబున శూద్రుండవై పైశాచికకృత్యంబు లొనర్చి సమస్త బంధుబాహ్యుండవై తివి. పూర్వభవంబున విమలాంగియే భవద్భార్యామణియై నీయందాసక్తిని జూపి నీ యమానుష కృత్యంబుల సైరించి నిన్నెడబాయ నొల్లక నీ పదాంభోజముల బూజించినది. బంగారువంటి కాపురమును నాశనముచేసి తినకూడు, కట్టబట్టగానక కడుగృశించి కడుం దిరిపంబవై, దేశద్రిమ్మరివై యొకానొక పట్టణమున విష్ణ్వా

లయంబుచేరి భగవద్భక్తుల సేవింపుచు, నాలయశుద్ధికై పాటు బడుచు సన్మార్గప్రవృత్తంబైన మనంబున మెలంగుచు సకల ఫలసాధనంబైన భగవద్భజనంబు సేయుచుంటివి. ఒక్కనాడు సౌవీరదేశాధినాథుండు చతురంగ సమేతుండై కాంతామణీ సహస్రంబుతో విష్ణుసేవాభిరతుండై యచ్చటి కేతెంచెను. మోహాతిరేకంబున నవ్విభు విభవాతిశయంబున కచ్చెరు వొందితివి. అయ్యది కారణంబుగాఁ గొని దేవదేవుండీ జన్మంబున నీకీ యభ్యుదయం బొనర్చె"నని వివరించెను. తనపూర్వ భవవృత్తాంతంబున కాశ్చర్య కబళితాంతరంగుండై మాంధాత వసిష్ఠువలన వేదాంతవిషయంబుల సర్వంబు నెరింగి యష్టాక్షరీ మంత్రోపదేశమును బొందెను. అనంతరంబవనినాథుండు తమసా సరయూ మధ్యంబునంకృత తపోధనుండై యుక్తనిష్ఠం దపంబొనరింప దొడంగెను.

కలవాంభోజనుం డొక్కనాఁడమరేంద్రుడు పాలికిం జని యేకాంతంబున మాంధాతగావించు తపోవిధానంగూర్చి ప్రశంసించి, తపోభంగ మొనర్పకున్న మొదటికే మోసము వచ్చుననియు, స్వర్లోకలక్ష్మి సురనాధునకు దక్కదనియు విశదీకరించెను. అప్పలుకుల కులికిపడి బలసూదనుండు దేవేలందుల బిలపించి లోనికలంకు మాటువరచి యాననమెగయించి మించి చిరునవ్వు చిందులాడ సాదరావలోకనంబుల జూచి వారితో మాంధాతృ మహీవరాగ్రణి యుగ్రతపంబును జెరపిరండని సంభావించి వీడ్కొల్పెను.

అప్సరోంగనలు శృంగారోజ్జ్వలాకారులై సరసక్రీడఁజొచ్చి మహీవరేణ్యునకు మనోవైకల్యంబుఁగల్పింప యత్నించి విఫల మనోరథలై ముందాడిన పంతంబుల పొంతఁబోక, సురలోకం బునకేగ మొగమెక్కక, రాజర్షియగు మాంధాతృ మహీపాలు నకు శిష్యలైరి. చేయునదిలేక సురేంద్రుండు నరేంద్రు విష యంబు నాగేంద్రశయను కెరింగింప వైకుంఠంబున కరిగెను. విష్ణుదేవుండు జిష్ణునోదార్చి మాంధాతృ మహీధవునకు మోక్షం బొసంగి తన సాయుజ్యంబునకుఁ జేర్చుకొనెను.

# 13

నృసింహకవి జన్మస్థానమును గురించి తర్జన భర్జనలు పెక్కుగలవు. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారీతని జన్మ స్థానము తాళ్ళపాకయనిరి. కీ. శే. చాగంటి శేషయ్యగారు పులివెందుల తాలూకాలోని సుంకేశుల గ్రామమీతని యభిజన మనిరి. మరికొందరీత డుత్తరసర్కారుజిల్లాలవాడనిరి. ఏది యెట్లున్నను గ్రంథస్థ విషయములనుబట్టి చర్చించుటుచితము.

కవికర్ణరసాయనము శ్రీరంగనాథున కంకితమీయబడినది. ఈ దేవాలయము పులివెందుల పట్టణమున కనతిదూరములో నున్నది. ఇందలి యర్చకులు పారాశర వంశీయులు. ఈ వంశీ కులు క్రీ.శ. 982 నుండి పులివెందుల తాలూకాలో నివసించు చున్నట్లు చరిత్రలు ఘోషించుచున్నవి. వీరే భట్టరువంశీయులు. వీరు శ్రీరంగమునుండి వలసవచ్చినట్లుఁ గాన్పించుచున్నది. వీరికే చాదాత్త వైష్ణవులనియు, సాతానివారనియు నామాంత

రములు గలవు. ఈ సాతానివారు పులివెందుల కైదుమైళ్ళదూర మునగల మడూరు గ్రామమున నేటికిని గలరు. వీరు ప-మ వైష్ణవులు. పులివెందుల శ్రీరంగనాయక దేవాలయ ముఖ ద్వారమున పురాతన లిఖితమగు శాసనముగలదు. అ శాసన మిది.

Local Records No. 491.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవత్స రంబులు 1481 అగు శుక్ల సం॥ర కార్తీక శు 12లు శ్రీమద్రా జాధిరాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాపకృష్ణదేవరాయలు పృథ్వీ రాజ్యం సేయుచుండగాను వసిష్ఠగోత్రం సూర్యవంశధృవు లైన బెజవాడ పురవరాధికృతులైన మాధవవర్మగారి సుపుత్రు లైన వల్లభరాజునిగారి పౌత్రులైన తిమ్మరాజుగారి పుత్రు లైన బసవరాజుగారి తమ్ములైన నరసయ్యదేవ మహారాజులు పులివెందుల శ్రీరంగరాజకృతదేవ"-యని యున్నది.

క్రీ. శ. 1509 ఫిబ్రవరి నెల 4వ తేదీన జరిగిన శ్రీకృష్ణ దేవరాయ పట్టాభిషేకమును బురస్కరించుకొని వారిజ్ఞాపకార్థము పునరుద్ధరింపబడిన సందర్భమున నీ శాసనముఁ జెక్కింపబడినది. "శ్రీరంగనాథస్వామి చరిత్ర"లో 10వ పుటలో క్రీ. శ. 982 నుండి రంగరాజభట్టరుండినట్లు లిఖింపఁబడినది. ఈతని తండ్రి కూరత్తాళ్వారు. ఈతని కోవకుఁజెందినవారే పారాశరులు. వీరికే దేశికోత్తములను నామాంతరము గలదు.

తిరుపతి దేవస్థానమున నీ వంశవృక్షముగలదు. సుంకేశుల గ్రామముననున్న నృసింహస్వామి దేవాలయమున కర్చకులుగ నీ పరాశరవంశీకు లుండినట్లు దోచుచున్నది. ఈ ప్రాంతమున వైష్ణవమతము నవలంబించిన కొందరు రెడ్డికులజులు తమగురువులైన భట్టరుల జ్ఞాపకార్థముగ "పిళ్ళా"యను బిరుదమును వహించినట్లు గాన్పించుచున్నది.

కవికర్ణరసాయనమందలి గురుస్తుతిని దిలకింపుడు.

క. గురువర భట్టపరాశర చరణ
సరోరుహానముల్ల సన్మానసుఁడన్
నరసింహా నామధేయుఁడ బరిచిత
సత్కృతి రసానుభవహేతువునన. (కవి. 7ప)

భట్టరు వంశీకులకు బదిహేను బిరుదములుండినవి. అందు నాలుగుమాత్రమే యిటఁ బ్రస్తావింపఁదగినవి. ( ) శ్రీరంగనాయకీ కరకమలలాలితపుత్రులు, (శ్రీరంగనాథుడు భార్యాసమేతుడై పులివెందుల గోస్తనీతటమున విహారమునల్పుచు దన హస్తద్వయమున భట్టరుల నుపలాలనముసేసెనట!) (2) శ్రీరంగనాయక కృపాలబ్ధ బ్రహ్మరథారూఢులుఁ (శ్రీరంగనాథుని రథోత్సవకాలమున తేరుపై నూరేగువారట!) (౩) దుర్వార చోళ గర్వతమోనిరసన మార్తాండులు, (వేముల కోటపైకి క్రీ.శ. 182లో రాజరాజచోళుఁడు దండెత్త నాకోట పాళెగాడీ రంగనాథభక్తుని శరణువేడ, నా భక్తుడు శ్రీరంగనాథుని సేవింప, చోళసైన్యములు పలాయనసూత్ర మవలంబించెనట!) (౪) శ్రీవేములరంగరాజభట్టరయ్యవార్లంగారు (పైనుడినగాధయే యిందుకు గారణముగానోపు.)

కడపమండలమున సిద్ధవటమును బాలించిన మట్లరాజులకీ భట్టరులే మతగురువులు. క్రీ. శ. 1౫౪౮లో మట్ల మల్లయ్య కుమారుడు రామయ్య శ్రీవేంకటేశ్వరస్వామికి 400 పణములు సమర్పించినట్లు తమిళములో నొకశిలాశాసనము తిరుపతిదేవాలయమందు రెండవ ప్రాకారంపు పడమటి గోడపై గలదనియు నారామయ్య భట్టపరాశరుని శిష్యుఁడనియు, నాంధ్రకవితరంగి

ణిలో వివరింపబడినది. మట్ల రామయ్యకును, నృసింహాకవికిని గురువు భట్టపరాశరుడే. ఈతని కాలము శ్రీకృష్ణదేవరాయల కాలములో సరిపోలుచున్నది. కాబట్టి పైముగ్గురును సమకాలికులని దేలుచున్నది. కృష్ణదేవరాయలు నృసింహాకవి సమకాలికులనుట నిర్వివాదాంశము.

సుంకేసుల క్రీ. శ. 16వ శతాబ్దినుండి వెలసినట్లున్నది. ఇచటి నృసింహస్వామినిబట్టియే కవికర్ణ రసాయనకారునికి నృసింహాకవి యని పేరు వచ్చియుండును. ఈతడు గండికోట రాజుల మన్ననలబొందినవాడు. ఈతని యింటిపేరు గ్రంథస్థము కాలేదు. జన్మస్థానమైన సుంకేసులనుబట్టి సుంకేసుల నృసింహాకవి యని వచ్చినది. ఈతడెంతమాత్రము "సంకుసాల" వాడు గాడు. "సుంకేసుల" సంకుసాలగా మారినది.

ఇతడు సుంకేసులలో జన్మించి విజయనగర సామ్రాజ్యాధీశుడైన శ్రీకృష్ణదేవరాయల యాస్థానమున నష్టదిగ్గజ కవులలో నొక్కడై వాసిగాంచినాడు. నరాంకిత మిచ్చగింపక భగవదంకిత మొనర్చి తనకావ్య మాచంద్రతారార్కముగ నెగడునట్లు జేసిన భవ్యమూర్తి నృసింహాకవి. ఇమ్మహనీయుని చరిత్రము కడపమండల కవుల చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖించుటలో నద్భుతమేమున్నది.

క. కవితావిచక్షణతగల
కవికంఠభూషణముగఁ గైకొనఁ దగు నీ యుం
గవివరనరసింహ విరచిత
కవికర్ణరసాయనము-కావ్యము దీనిన్॥

—: సమాప్తం :—